శ్రీరామవిలాసగ్రంథమాల ౩.

# రాయలరాజనీతి.

ఇది

శ్రీకృష్ణదేవమహారాయలవారిచే
రచియింపఁబడిన

(యామునాచార్యకథ ననుసరించి)

వంగూరి సుబ్బారావుగారిచే
వచనముగఁ బరివర్తింపఁబడి

శ్రీ చెలికాని లచ్చారావుగారిచే
సంపాదింపఁబడియెను.

మొదటికూర్పు 1000.

పిఠాపురము.

శ్రీవిద్వజ్జనమనోరంజనీముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడియె.

1915.

ఇతరులకు వెల రు 0-4-0. } పోస్టేజి వేరు. { చందాదారులకు 0-3-0 లు.

# భూమిక.

ఈగ్రంథము శ్రీకృష్ణదేవరాయ లొనరించిన యాముక్తమాల్యదయందలి రాజనీతిప్రకారమ బని గ్రంథకర్త పీఠికవలనఁ దెలియ నగును. నీతిబోధకములగు గీతములు, చరిత్రములు, నవలలు, కథలు, మున్నగునవి ప్రకటించుటయే కాక నీతిశాస్త్రము, అర్థశాస్త్రము మున్నగు ప్రాచీనరాజనీతి, దండనీతి, గ్రంథములుకూడఁ బ్రకటించి ప్రాచీనహిందూదేశ చరిత్రరచనకు సాయపడుట యవసరమైనపనియే యై యున్నది. శుక్రనీతిసారాదిగ్రంథములు మనపూర్వు లెట్లు దేశములఁ బరిపాలించిరో, దేశమునకుఁ, బ్రజలకు, రాజునకు, నెట్టిసంబంధము గల చట్టము లుండెడివో వివరముగఁ దెలుపుచున్నవి. ఇట్లే యాంధ్రభాషయందుఁ బరభాషలయందున్న యపూర్వగ్రంథవలఁ గాని, ప్రజల కందఱకుఁ దెలియుసులభవచనగ్రంథములఁ గాని, వ్రాసి ప్రకటించుటకుఁ బ్రయత్నింతుము. గ్రంథము చిన్నదైనను, విషయ మాంధ్రప్రబంధములోనిదైనను, శ్రీరాయలవారియందలిగౌరవముచేతను విషయగౌరవముచేత నిది ప్రథమగ్రంథముగఁ బ్రకటించితిమి. ముందుముందు కామందకీ యాదిగ్రంథములు భాషాంతరీకరణము లొనరించి మాచందాదారులకు సమర్పింపఁజూతుము. ఇట్లే శాంతిపర్వాంతర్గతభీష్మనీతి "శా

జనీతిసారము''ని ప్రకటింప నిష్టము కలదు. మా పాఠకుల కావిష యములను, మేము చేయఁబోవు పనులను, ముందు తెలియఁ జే యుచుందుము.

చెలికాని లచ్చారావు.

సంపాదకుఁడు.

1

# పీఠిక.



ఇది, శ్రీకర్ణాటాంధ్రకవిరాజ్యపట్టభద్రుఁడై, యాబాలగోపాలమున కాచంద్రతారకముగఁ జిరస్మరణీయుఁడైనశ్రీకృష్ణదేవమహారాయఁ డొనరించిన యాముక్తమాల్యదానామాంతరము గలవిష్ణుచిత్తీయప్రబంధమునందు నాల్గవయాశ్వాసమున యామునాచార్యుఁడు, విరాగమునొంది తనయునికిఁ బట్టముకట్టుచు బోధించినరాజనీతిప్రకారంబు. పద్యరూపమున నుండినరాజాధిరాజగు రాయలొనరించినరాజనీతిప్రకార మాంధ్రులకు నారికేళపాకకావ్యమునఁ బడియున్నది యించుకవేలుగ రుచిచూపఁ దలంచి యిట్లొనర్చితిని.

ప్రాచీనరాజనీతిగ్రంథములు కొన్ని సంస్కృతభాషలో నున్నవి. భారతము, శుక్రనీతిసారము, కామందకీయము, పంచతంత్రమున్నగుగ్రంథములయందనేకవిషయముల నార్యులనాగరికత యభివృద్ధినొందినట్లు ప్రబలనిదర్శనములున్న రాజనీతిగ్రంథములున్నవి. అవి చాలవఱకు మనభాషలోనికిఁ బరివర్తింపఁబడియే యున్నవి. ఇంక నున్నవి మనము భాషాంతరీకరించుకొనవలసి యున్నది. సుమతిశతకాది స్వతంత్రగ్రంథము లరుదుగ నున్నవి!

రాయలొనరించిన యీరాజనీతి సుమారెనుబదిపద్యములలో నున్నది. ఇదియంతయు రాయలస్వానుభవ మని కొందఱువిద్యాధికు లభిప్రాయపడియున్నారు. అందు ముఖ్యముగఁ గొన్నిభాగముల శ్రీరాయలసత్యకవిత్వ, సత్గ్రంథకర్తృత్వముల నిరూపించిన శ్రీగాడిచర్ల హరిసర్వోత్తమరావు ఎం. ఏ గారు తమ *"Neglected Emperor poet" అనుగ్రంథమున నిట్లు వ్రాసియున్నారు.

Kistnadevaraya was a king of great ability ahd his views on politics proceed form practical experience in that sphere × × ×

* See "Acritical essay on Kistnadevaraya's Amuktamalyada" P. P. 76 & 78.

(2) the rest of Kristnaraya's advice is full of practical hints and information most important for a reigning prince.” అనునీ రెండు వాక్యములును రాయలరాజనీతిపై శ్రీహరిసర్వోత్తమరావుపంతులవారియభిప్రాయముల కాద్యంతములయం దున్నవి. దీనినిబట్టి శ్రీపంతులవారి రాజనీతియంతయు రాయలనుభవమువలన వ్రాసినదనియే యభిప్రాయమైనట్లు తేలుచున్నది.

ఇఁక నాముక్తమాల్యదాపీఠికయందు విమర్శన మొనరించి, యాకావ్యమునకు మెఱుఁగుఁబెట్టి శ్రీరాయలగ్రంథకర్తృత్వమును నిరూపించినశ్రీమేడేపల్లి వేంకటరమణాచార్యులవా రనుసుప్రసిద్ధసంస్కృతపండితులు వ్రాసినది.

*“ యామునాచార్యుఁడు కుమారున కుపదేశించిననీతి:- ఈనీతినిబట్టి విమర్శింపఁగా రాజ్యపాలనానుభవమందుఁ బండినబుద్ధిగలరాజన్యుఁ డిట్లు వ్రాయఁగలుగునుగాని, కేవలగ్రంథాధ్యయనమువలన నీతిశాస్త్రమందుఁ బాండిత్యము సంపాదించినబ్రాహ్మణపండితుఁ డిట్లు వ్రాయఁజాలఁడనియు, దీనిచే నీగ్రంథకర్త రాజ్యపాలనమం దారితేరినక్షత్రియుఁడనియు నిస్సంశయముగఁ జెప్పవచ్చును.”

ఇంతవఱకు నీగ్రంథమును విమర్శించినవిద్యాధికులయభిప్రాయము లిట్లున్నవి. వీనియందలి సత్యాసత్యములఁబరికించుటవలన స్థిరపఱచుకొందము. ఈసందర్భమున పైవిద్యాధికుల కొకమనవి! ఆముక్తమాల్యదాగ్రంథకర్తృత్వమునశ్రీరాయలకుఁదప్పయితరులకుఁబ్రమేయముకలుగఁజేయుటయందుఁగోరికకలవారినికాని, శ్రీరాయలవారు రాజనీతిపరుఁడుకాఁడనికాని,యనువారిని ఖండించుటయం దీపంక్తుల లిఖియించినయాతఁడు ప్రప్రథముఁడై నిలువఁబడును. అందావంతయుఁ బైవిమర్శకులయభిప్రాయములనుండి వేఱుపడువాఁడు కాఁడు! కాని (1) ఈరాజనీతి రాయలయనుభవమువలనవ్రాసినదా? (2) పూర్వగ్రంథములఁ జదివి యార్జించినదా? (3) లేక నీతిశాస్త్ర మభ్యసించినపిమ్మట (లేక

* 1914 సం॥రమున వావిళ్ళ రామస్వామిశాస్త్రులు & సన్సువారు ప్రకటించిననాల్గవకూర్పుపీఠిక LXIV పుటచూడుఁడు.

పఠించినపిమ్మట) ననుభవమున సరిపడినవి పోల్చి, చేర్చి, మార్చి, వ్రాసినదానిని యనుమానప్రశ్నముల నొనరించుకొని స్థిరపఱచుకొనుట న్యాయమని తలంచి యీపనికిఁ బూనుకొంటిని. సత్యాపేక్షకులు నాయందు హాలమువహించు పైపండితులు నా యీకృత్య మపచారముగ నెంచకుందురుగాక! యని కోరుచున్నాను.

శ్రీరాయలొనరించినయీరాజనీతియందుఁ జాలభాగము ప్రాచీనరాజనీతి గ్రంథములనుండి సేకరించునట్లు నాకుఁ బొడకట్టుచున్నది. అందుల కొకటి రెండుదాహరణములఁ జూపెద.

(1) ఆముక్తమాల్యద 4 వ యాశ్వాసము 210 పద్యము. ఇది (భారత శాంతిపర్వమునందలి నాడీజంఘునిచరిత్రమునుండి తీసిననీతి.)

(2) డిటో. " " 205 (ఇది శాంతిపర్వము 2 ఆశ్వాసము, 170 మొదలు చూడుఁడు!)

(3) ఆముక్తమాల్యద " 233 శాంతి 2. 186, 187.

(4) డిటో. " " 238 శుక్రనీతిసారము. శ్రీమల్లయశాస్త్రిలవారి యాంధ్రీకరణము. 14వ పుట.

(5) డిటో. " 278 శాంతి 4. 368ప.

(6) డిటో. " 261 శుక్రనీతి 129 పుట.

(7) ఆము॥ 271 చాణక్యనీతియందీకాలవిభాగముకలదు, శుక్రనీతిసారమునందున్నది.

(8) ఇంకను వెదకినచో స్వల్పభేదము లున్నవి మానితిని.

ఇట్లే కొంచెము భేదములతోఁ జాలభాగము—చాలభాగ మననేల?— ఏపదియిరువదిపద్యములయందుఁ జూపినయభిప్రాయములో తప్ప తక్కినవన్నియు నితరగ్రంథములయం దున్నవాని కించుకభేదములే! పరివర్తనములే! దీని వలన మనము గ్రహింపవలసినదేమనఁగా! శ్రీరాయలవారు సంస్కృతవాఙ్మయమునందున్న నీతిశాస్త్రగ్రంథము లన్నియుఁ బఠించి, యాచరించి, యందుఁ దాను కనుఁగొనిననూతనవిషయముల ననుభవములఁ జేర్చి, పైఁజెప్పినమూడవిధములను నీనీతి వ్రాసినని తలంపవలసి యున్నది. కొన్నివిషయములు బహుస్వల్ప

పటుగ నున్న నపూర్వములును, మేధావంతములు నైయున్నవి. కొన్ని శ్రీరాయలవారి యనుభవములే యై యుండును! ఏమైన నాంధ్రసోదరులీభాగము విపులముగఁ జదివి లాభము నొందుదురను నాసచే నిది యిట్లు గద్యరూపమున వ్రాసి ప్రకటించితిని. ఇందు భారతాదులవలెనే బ్రాహ్మణులయం దాధిక్యముంచినను, మంత్రిత్వాదులు (స్వపూర్వతగల) బ్రాహ్మణులకే యిమ్మని భారతాదులు చెప్పుటకుఁ గలకారణము లిందు దాఁపక తెలియఁజెప్పఁబడినవి. రాయలకాలము నాఁటికిఁ గూడఁ బ్రజలపై బ్రాహ్మణాధికారము నిరంకుశమై యుండె! అందువలననే రాజు స్వప్రయోజనమునకు వారల గౌరవింపవలసివచ్చెను. పైఁగ బ్రాహ్మణుఁడు బుద్ధిశాలి!

ఇందు 6వ పుటలోనున్న "ఆపాలయన్నము నేభుజించువారయ్యె" అనువాక్యమువలన రాయలకాలమున "పాలయన్నము" యిప్పటిగంజియన్నము వలె నధిక సులభలభ్యమని తెలియఁజేయుచున్నది. రాయలరాజనీతికిని, చరిత్రమునకును గలసమన్వయమును విచారించుట విమర్శకులపని.

శ్రీరాయలవారిపదములకూర్పు జటిలము నపూర్వము నగుట, నీమహాకావ్యము నాంధ్రు లంతగా వాడకున్నారు. ఆముక్తమాల్యదయందలి స్వభావోక్తులును, రాయలవారియద్భుతకవితాశక్తియుఁ బరిశీలింపఁ గుతూహలమొదవింపుట కీవచనము కారణము కాఁగలిగినచో నీగ్రంథకర్తపని వ్యర్థముకాదు. రాయలవారిపదములకూర్పు సొగసుగఁగాని, విషయవివేకానుసరణిఁగూర్చిన యౌచిత్యముకాని కలచోట్ల నేనంతగా మార్పక కేవలము పద్యమును వాక్యధోరణిగ మార్చుచు వచ్చితిని. కొన్నిచోట్ల గ్రంథమూలవస్తువునకనుగుణ్యముగ శబ్దజాలము నెఱుఁగఁగోరువిద్యార్థుల కుపయోగపడునట్లు పర్యాయపదములు పెక్కులు వాడితిని. మిక్కిలి కొలఁదికాలములో నొనరించినయీకార్యమునందు లోపములఁ గాని, యభిప్రాయభేదములఁ గాని యెఱిఁగించు విద్యాధికుల కారణలేఖలకనేకవందనము లొనరించెదను.

ఇట్లు,

పిఠాపురము. 1-1-16.

వంగూరి సుబ్బారావు.
గ్రంథకర్త.

# రాయల రాజనీతి.



ఱేఁ డేసమయమునందునను విసుఁగుకొనక ప్రజారక్షణతత్పరుఁ డై యుండవలయును. ఆపదలనొందినవారి మొఱ్ఱ నాలకించి రక్షించుచుండవలయును. దుర్మార్గులపైఁ గార్యభారము నుంపరాదు. రాష్ట్రాభివృద్ధి నొందించు రాజువృద్ధినొందవలయునని ప్రజలు కోరుచుందురు కావున నందువలన లాభ మేమని రాజు నిరసింపక ప్రజలయభివృద్ధికిఁ బాటుపడుట లెస్స. అందువలన బ్రాహ్మణాది ప్రజలహృదయవాసి యగుభగవంతుఁడు వారి యేకముఖపుఁగోర్కె ననుసరించి రాజునకు మేలు సేయు. వనచరులును, (నాగరికతాశూన్యులునగు) గొల్ల, చెంచు, బోయవాండ్రకుఁ గూడ నంపకోల, నూలుపోగుల †నాన చెల్లుచుండును గావున రాజు తనదేశమునందుఁ దనయాజ్ఞ కెల్లవారును దల్లడిల్లున ట్లొనర్పవలయును. దుర్గాధిపత్యము నాప్తులయిన ద్విజవర్గమునకే యీఁడీయవలయును ఆదుర్గాధిపతి యెట్టిరాజు దండెత్తి వచ్చినను భయము చెందని (సాధనసైన్యసమయుక్తుఁడును) కొలఁది కాని వాఁడును నై యుండవలెను. మొదటఁ బెద్దయధికారాదులవలన వృద్ధికిఁ దెచ్చి యాతని కుచితగౌరవ మీకున్న నాతఁడు

† దొరలిచ్చు నానవాలు. అంపకట్టి, నూలుపోగులఁ జూచి యితరచోరులా ముద్రికలవానిని ముట్టరు.

దనతొల్లింటిహీనస్థితికిఁ బోల్చుకొని సంతసించి సైరింపలేఁడో కావున సమ్రాట్టు వానినడవడిగుణములఁ దెలిసికొనుచుఁ గ్రమాభివృద్ధి నొందిన (దయాగౌరవములఁ) జూచుచు నాతనివలనఁ బనులఁ గొనుచుండునది. హీనకులము (Low Family) వానిని, అనాగరికు లగుశబరాదులపల్లెల జీవించువానిని, అపండితుని, పిరికివానిని, అసత్యవాదిని, ‡ఆతతాయిని, (ద్రోహచింతకలవానిని) అపవాదభీతి నొందనివానిని, విదేశజుని, ధర్మశూన్యుని, బ్రాహ్మణుఁడైన నుద్యోగాదు లిచ్చి రాజు పోషింపఁ జేరఁదీయఁ జనదు. సదాచారప్రవృత్తిభ్రష్ట మయిన పట్టణములయందుఁ బెరిఁగిన బ్రాహ్మణులను జేరఁదీసినరాజు చెడును. పూర్వము తన్నుఁ గాపాడినకొంగ నొకపూటకుడుపుఁ గక్కుఱితికొక బ్రాహ్మణుఁడు జంపి తినె. § కావున దుష్టబ్రాహ్మణసంరక్షణసంసర్గము రాజు చెడును.

పండితుఁడైనవాఁడును, అధర్మభీరువును, రాజనీతిపరిజ్ఞాతయు, డెబ్బదివత్సరములకు లోను నేబదికిఁ బైఁబడ్డవాఁడును రోగహీనుఁడును, మంత్రికులములోనివాఁడును, మదహీనుఁడును రాజప్రార్థనము మన్నించువాఁడును నైనవిప్రుఁ డమాత్యుఁ డైన

---

‡అగ్నిదో గరదశ్చైవ శస్త్రపాణి ర్ధనాపహః క్షేత్రదారాపహర్తా చ షడేతే ఆతతాయినః॥

§(శాంతిపర్వము, తృతీయాశ్వాసము, 472 పద్యాదిగ నున్న నాడీజంఘుని చరిత్రముఁ బరికించుచున్నది.

*రాజ్యాంగము లభివృద్ధి నొందుట కొక్కపూట చాలును గావున ఱేఁ డక్షమంత్రిని నియమించుటయం దధికభద్రముగఁ బ్రవర్తించునది.

అట్టిమంత్రివర్గము దుర్లభమైనయెడ రాజు స్వతంత్రుఁడై సేనార్థబలమున నీతిశాస్త్రపరుఁడై స్వబుద్ధిచే రాజ్యపరిపాలన మొనరించుట సేమంబు. అట్లుకానియెడ గుమ్మడికాయయంతముత్యఁ మమూల్యమయ్యు ధారణమునఁ బీడాకరమైనట్లు పైనఁ జూపినగుణములు లేనిమంత్రిని బెట్టుకొనుఱేఁడు తా స్వవశుఁడు కాని మంత్రిచేతఁ జిక్కి చిక్కులు పడవలసినవాఁ డగును.

(ఒక్కఁడు చేయఁదగినపనికిఁ బెక్కుమందియుద్యోగుల రాజు నిల్పఁదగదు.) అట్లు నిల్పవలసిన కార్యమైనచో వారన్యోన్యము మిత్రులైనవారిని నిల్పినఁ గార్యము ఫలించును. అట్లుని తగ్గించి కొలఁదిమందినే నేమించినఁ గార్యము కఠినసాధ్య మగును. ఎక్కువమందియైన సుసాధ్యమగును.

కేవలము ధనవ్యయమువలన నన్నిపనులును సఫలములు కావు గాన (రాజు ధనము కలదు మన కేమని గర్వించి యుండక) ఆస్థగల్గి పలువురుప్రభులు సాయపడి పనిచేయునట్లొనరించుకొనవలయును. ప్రభువుల స్వాధీనము చేసికొనుట కౌదార్యవృత్తియు, అక్రౌర్యబుద్ధియు, సత్యప్రవర్తనమును సాధనములుగఁ

*స్వామ్యమాత్యసుహృత్కోశ రాష్ట్రదుర్గబలానిచ రాజ్యాంగాని

జేసికొని (నరాజు సుఖి యగు.)

మూలధనాదికములు సంపూర్ణముగ నుండియు, అశ్వ (గజాది) సాధనము లుండియుఁ, దగినమనుష్యులు లేకపోవుటవలన రాజ్యములు కృశించి పరరాజుల కొదిగియుండిన రాష్ట్రము లనేకము లుండుటఁ జెవులార వినుచును (తగినమనుష్యులఁ జేపట్టికొనక యుపేక్షించినవాఁడు కీడుఁ జెందును.)

క్షత్రియశూద్రాదులు (బ్రాహ్మణమంత్రి) యని గౌరవమున) ననుసరింతు రనియైనను, ప్రభువులఁ గొలిచి జీవించు (వృత్తిగల) బ్రాహ్మణజీవితము తెలిసియైనను, కష్టములు వచ్చినప్పుడు సహించును గావునను, శతవిధముల బ్రాహ్మణుని బ్రభుని (అమాత్యాదియుద్యోగిని) జేయుటఁ బతికి హితము.

ధనము గాఁబట్టుటయందు నేర్పుగలవానికి దేవాలయాదులపై నధికారము నివ్వఁగూడదు. అట్లిచ్చినయెడలఁ దా నుద్యోగము చేయుదేశములయందు రానిధనము నా దేవాలయాదాయములఁ బూటపఱచి జేనిభాండాగారమున కాతఁడు చేర్చును. అట్టిధనము రాజున కభోజ్యము. కావున సద్బ్రాహ్మణుని దేవాలయాదులపై నితరయధికారముల నీయక యొక్కని వేఱుగ నియమించుట లెస్స. కక్కుఱితిచేఁ గొంచెమైన నాధన మనుభవించినను వాఁడే నశించును.

ఆవరణాదులచేఁ దనసీమను జేసికొని యందలి వృక్షకంటకాదులఁ ద్రవ్వి చేను మెత్తఁబఱచుకొని సస్యోన్ముఖముగఁ జే

సికొనిసుఖించుకర్షకునింబోలె రాజు శత్రులతోఁ గపటమైత్రియైన నెఱపియో, దుర్గబలములఁ గైవసము చేసికొనియో, పరునివలనదోసఁ గగునని భీతిలేక యుండి, యప్పుడులోనఁగల క్షుద్రశత్రునిర్మూలన మొనరించునది.

రాజు కొండెకానినేని పదివిధములఁ బరిశోధనఁ జేయనిది మొదలే విడువఁ దగదు. వాఁడు మృషావాది యయ్యెనేని వాని నొకపక్షమునకుఁ బరాభూతుండు గాకుండ విడుచునది.

దుర్గమ మగునరణ్యములఁ గాపురముండి రాష్ట్రపీడాకరము లగు నెఱుకులు మున్నగుజాతులు వసించుభూములపై విదేశములనుండి చెడి వచ్చినప్రభువుల మనోవృత్తికై వశముచేసి వారి నట నిల్పునది. అందువలన నొండొరులం బాఁకుటలో నెఱుకులు కాని, పరదేశజులు కాని నాశన మైనయెడల నష్టము లేకపోవుటయే కాక యాటవికజాతులు నశించిన యెడల దేశ శుభంబైనఁగూడఁగావచ్చును.

మఱియు నయ్యాటవికులబలంబు లడవులఁ గూడుకొని, వృద్ధియయ్యెనా మండలాధిపతికిఁ బ్రజాపీడ తగ్గదు. (వారెప్పుడు తిరుగఁబడి రాజునకు శ్రమ కలిగింతురు.)

ఏవ్విధముననయిన వారలబెదరు వాఁపి వారలఁ జేకూర్చుకొనుట లెస్స. వారల కవిశ్వాసంబును, విశ్వాసంబును, నలుకయు, ప్రీతియు, నతివైరంబును, నత్యనుకూలంబును, నల్పుగుట నల్పంబున నగు; నెట్లంటేని:—

మించి పాలించుచుండవలెను. వాని నొప్పుఁ బ్రైసుభటులు నైవశము చేయవగును; కాని దొరలవా లొసరింపఁ జనదు.

ఎవ్వఁడైన నొకకార్యగతి నెఱిఁగి చెప్పినప్పు డాతని ప్రతిశక్తి యాతనిపైఁ గలుగునకు కారణమున నాతనిమాటల ఖండించును. ఱేఁడు సభయం దిటువంటను గాదనక సభ విడిచినపిమ్మట నుఖాలోచనము చెప్పినప్రశ్నముఁ దెన్నినది చేయ శుభంబగు.

వెలుపలిశత్రువులను జూచి రాజ్యమునందలివిత్తుదశ్రి శత్రువులను కూడఁగట్టుకొని వృద్ధిచేసి, దుష్టమంత్రులు రాజును చిక్కులపాలుజేసి వైనశముచేసికొని పనులాలసించి తామే దిక్కుగఁ బ్రవర్తింపఁ బ్రయత్నింతురు (కావున ఱేఁ డట్టిమంత్రులు లేకుండఁ జూచుకొనునది.)

ఆశ్రితవశులకు వలసినదాని నిప్పించుచుఁ, గానివారికిప్పించుచు, యిప్పించెదమని చెప్పి తప్పింతురు. రా జట్టియాడి తప్పువాఁడని పరులకుఁ దోఁపఁజేసి వేయిమంది చెప్పినను వారికి మరల నమ్మకము పుట్టకుండఁ జేరకుండఁ జేయుదురు. (దుష్టమంత్రిలు)

ఉదరాగ్ని కఫాదిదోషములచే మందగించి స్వత్వహీనుఁడైనవానికి బయటిమందులు వేసి రోగనిర్మూలన మొనరించునటుల ఱేఁ డట్టివారిమీద మిత్రు ప్రసక్తిప్రజ్ఞానిధులఁ బరుల నియమించునది.

వారిని మరల ప్రీతిసేయువిధ మెట్లనిన:—

ధనదానములును హాయుమదశుండాలాదులచే బలవంతుండైన ఱేఁడు పండితుండై, శూరుండై, దుష్టమంత్రులకుం బ్రీతికార మొనరింపలేకుండవలయునా?

తనభోజనమునం దొకముద్ద తగ్గిన యొడఁ బతిని జెఱుపఁ జూచువారే కాని దేనికి మిత్రు లుండరు. అట్లని రా జెల్లర విడువఁ గూడదు. తగినట్లు ప్రవర్తించుచును సమయముం జూచుచుం బతి కడు మెలఁకువతో నెవ్వరి నమ్మకయు ప్రవర్తించుట శ్రేయంబు

ఏదేని యొకకార్యమున కేవగింపకఁ శ్రద్ధాళుఁడై ఱేఁడు తక్కిన కృత్యములఁ బరిశీలింపవలయును. అన్ని కార్యములను బరిశీలింపఁ గష్టమగుట రాజు స్థాలీపులాకన్యాయము ననుసరించి రిశీలింపవలయును. పాంచాలుండు మారణహోమమునకై గోవుఁ జూపి, యొకమునీంద్రుని వేఁడ నాతఁ డాహింస కంగీకరింపక "హా! ద్రుపదుఁడా! అపవిత్రస్థలమునఁ బడినఫలమును నే సేవగింప; నాయన్న దానిని బరిగ్రహించినాఁడు. ఆతఁ డీహోమము చేయ నంగీకరింపవచ్చును. పోయి యడుగుము" ని చెప్పెను. కావున నొకకార్యమునుబట్టి మనుజునినడవడిని బరిశీలించి వానిస్వభావము నెఱిఁగి సద్వ్యాపారోచితవిధమున నియోగించునది.

ఆపత్సమయమునఁ గీడు చేయఁ దలఁచినవాఁడని యొాది చేఁజిక్కిన శత్రువునైన రాజు హింసింపవలదు. వానిసంపద వా

క్షించుట కర్తవ్యంబు. కోఱలూడినపా మేమిచేయఁగలుగును? వైరియుఁ జేఁజిక్కినశత్రువును సత్ప్రభుఁడు కావున హింసింపఁడని విశ్వసించును. ఆవిశ్వాసమును వమ్ముచేయ సత్ప్రభున కుచితంబు కాదు.

దేశవైశాల్యము ధనాగమమునకుఁ గారణ మగుట రాజు భూమి నెక్కువగ సంపాదించునది. కొలఁదియైన యెడఁ జెఱువులు, కాలువలు, త్రవ్వించి పేదరైతులకు ధనరూపవస్తురూప శుల్కములఁ దగ్గించి వారిని వృద్ధిచేసిన యెడ సర్వధర్మములు పెరిఁగి రాజు సుఖించును.

ప్రజలు నొగిలి దేశమును విడిచిపోవకుండ బలువక వారిపశుధాన్యాదికముల నమ్ముచు, వారిగృహములదూలములు వంటకట్టెలకుఁ బనికివచ్చునని, యుద్ధభూమియందలిజంబుకముభాతి కీడుఁగోరుదుష్టాధికారి గలదేనికీ సప్తద్వీపవలయితభూచక్ర మిచ్చినను సమృద్ధి వ్యాగ్యంబగు.

సమ్రాష్ట్రాదాయంబును చతుర్భాగము లొనరించి త్యాగభోగంబుల కొకపాలును, చతురంగబలరక్షణార్థ మిరువాలును, ధనాగారము నింపుట కొ(Reserve fund.)కపాలును వ్యయ మొనర్పునది. చారముఖంబున వైరిరాజులను సచివాదిస్వపక్షజనులను, బరిశీలించుకొనుచు ధరణీనాథుఁడు తనదేశమునం దలిదొంగల నాశనమొనరించుచుండునది.

తలవరులను బట్టితెచ్చినదొంగల రాజు సత్వరము విచా

తించి శిక్షించు మనది. ఆలసించి యూదొంగ పాఱిపోవ సూరసుస్తి పెద్దకోమటిశెట్టి కొఱతకు సరిపడు దేహపుష్టి కలవాఁడని చంపించినయొక రాజువలె రాజు దండమున సశ్రద్ధవహించిన నపకీర్తిభాజనుండగుట సిద్ధంబు.

స్వశక్తివలన విషయంబుల నాలుగుపాళ్లలో మూఁడుపాళ్లెఱుఁగుచుఁ, దెలియకుండ దాఁచిన పెరవిషయము లొక్కపాలి నాప్తులవలనఁ దెలిసికొనుచుఁ, బరిపాలన మొనరించునది. ఇట్టి నిరాగ్రహుఁడైనచోఁ దనకు విపత్తులు లేనివాఁడై, క్రూర దండమునకు లోనుగాకయే చిరకాలము రాజు రాజ్యమొనరింపఁ గలుగును.

వృక్షాగ్రమున నొకకంట నిద్రించుచు రెండవకంట జాగరమొనరించు భల్లూకంబువగిది మహీపాలుండు రాజ్యభోగము లనుభవించునెడ బాహ్యాంతరశత్రువులపై నొకకన్నిడి యుండ మేలగు.

నశింపని † పక్షపాతముచేత జేఁడు ధనగ్రామాదికముల భిక్షుజటాధరాదికుల కీయ నగత్యము లేదు. అట్టిచ్చిన నుబ్బి వారు తమతమ వ్రతనియమములు వీటఁబుచ్చెదరు. అందువలనఁ గఱవులు, రోగములు, బాలారిష్టాదులు పెక్కుగు. కావున మహీధవుండు వారియెడ మిక్కిలి భక్తియుతుండై

† విద్యాపక్షపాతముచేత, వేదాంతపక్షపాతముచేతననికూడ నన్వయింప నగునని కొందఱనుమతమున

యుండినఁ జాలు. అట్టియనంతన వారికిఁ గలుగు (సన్యాసుల కష్టములు) తేని కేయఘనుముతు దూర్పంజాలవు. ఈవిషయమున రాజు నిర్భయుఁడై యుండునది.

రాజు చంపఁదగిన ప్రజలవిన్నపములను మహామాత్యులైన విని యోర్వఁదగు. విడిచిన యెడ తేని కప్పుడ చెడుగగునను వారలఁ బట్టుటకు బంధించుటకును దండనీతియే శరణ్యము కదా! రాజు తాను మహోత్సాహుఁడయ్యుఁ బరవీరాలాపముల విని యోర్వఁదగును. అట్లోర్చుటవలన నావీరు లుబ్బుదురు. పృథ్వియందుఁ దన పరాక్రమమును బ్రదర్శించుట తనతో నీడువచ్చుదొరలయందుఁ గావలయు. (అనఁగా తనతో సమరానిభటాదివీరాలాపము లతేఁడు విని సహించుటయు క్షమ.)

సముద్రతీరములయందలి (రేవు) పట్టణములయందు గుఱ్ఱములు, ఏనుఁగులు, రత్నచందనమౌక్తికసముదాయమును, విరివిగ వచ్చునట్లును, వర్తకాభివృద్ధి యగునట్లును, జేసి రాజు పాలింపనగు. వర్షబాధచేతను, రోగపీడను, అలసటను డస్సి చేరుదేశాంతరవాసు లగువారిని బ్రభుఁడాయూజాత్యోచితి ననుసరించి రక్షింపవలయును. తోఁటలను, పశువులమందలను, గనులను, మిత్రులయినవారినే చూడఁబంపుట రాజున కుచితంబు.

లక్ష్యసిద్ధి కుదురువఱకు బాణము విడువనివిలుకాఁడుంబోలె సమయము వచ్చువఱకు నపరాధిపై రోషము విడిచి యదనుఁ జూచి చెఱుపఁగలరాజు సుఖించు.

వెనుకవచ్చువరదనీటికై వేచియుండి ప్రవహించునదీజలంబులంబోలె సమ్రాట్టు వైరిదేశమున మెల్లగ లఘుపరియాణము చేయుచుం బోయి, తనకాల్బలాదిసామంతనృపులసైన్యము చేరి బలవంతమైనకొలంది నుపనదీశోభిత మగునదియుంబలెం బ్రయాణమొనర్చుచుండునది. ఎదిరి బలవంతుండైనచో వాండొనర్చుపూజాదుల గ్రహించి మళ్ళవలయును. వైరి క్షుద్రుండని చారులవలనం దెలిసికొనినయెడల మళ్ళక యావరించి విజితునింజేయంబోలు.

తనరాజ్యమునందలి ప్రజలు నొచ్చునట్లు ధనమును స్వీకరించుటయు, పందలతో నాలోచన మొనరించుచుండుటయు, శత్రువులు బలముననాక్రమించినతనభూమియందుం గొంతయిచ్చి సంధిచేసికొనుచుండుటయు, (ననునీమూడురాజదోషముల వ.)భేదోపాయముచే నివి మూడును శత్రురాజుయందుండునట్లును, తనయెడ నీమూడుదోషములు లేకుండునట్లును లేదు చూచుకొనుచు, ముఖ్యస్నేహము నయినం దలంపక తమయెడ ననుమానము నొందియుండెనని లోలోనం బొగయు నరిసామంతులకు నభయదానము చేసియు, మణిభూషణాదుల రహస్యముగ నంపియు భేదతంత్రమున నిపుణుండై (సమయము ననుసరించి శత్రురాజ్యమును గైవశము చేసికొన నగు.)

లేదు స్వపక్షభీతి కలిగినప్పుడు శత్రురాజు తా నేలుచున్నరాజ్యమునం దర్ధభాగమైన వేడిన నిచ్చి యాతనితోం డె

గనిమైత్రి నొసరించుకొని, స్వపక్షభీతిని మాన్పుకొనందగు. ఏ మన నహిభయము (స్వపక్షము వారిచే గీడగుననుభీతి) యహిభయము (సర్పభయముకంటె) మహి బాధించును గదా!

పార్థివుండు స్వభుజారక్షిత మగుపృథ్వియం దుండి తనరహస్యమును శత్రువులకు వెలిబుచ్చుచుండు తుట్టుపేమనా (గూఢశత్రువును) శతధా వెదకి యణచి స్త్రీసంఘమునందు నిర్భయముగఁ జరించుపురుషుంబోలె తనప్రజాసంఘమునందు సంచరింపలేఁడేని రాజునకు రాజ్యలక్ష్మి సుఖదాయకము కాకపోవుటయే కాక దుఃఖజనక మైనది యగును గదా.

భయపడి దగ్గఱకుఁ జేఱనిబలవంతుని ప్రయత్నపూర్వకముగ, బలవంతముచే రప్పింపక, తనకుఁ దానే వచ్చి కైవశమగునట్లు మత్స్యములవేఁటకాఁడు పెద్దచేఁప గాలమును మ్రింగునప్పు డొడ్డునఁ గూర్చుండి నెమ్మదిగ సూత్రమును విడుచుచు జేదుచు మత్స్యమును బట్టుకొనినట్లే యొనర్చుట నీతిపరుం డగునికి లక్షణము.

దండంబున కాఠిన్యంబును, కొండెమును బరీక్షింపకుంటయు, శత్రువు సంధిపడుట కవకాశమీయకుండఁ దిరుగఁబడచుంటయు, విదేశరాజు తనకొనర్చిన నేరముల నెన్ని, కనఁబడిన విదేశజునిఁ జెఱచుటయు, ప్రతికూలుఁడైనవానికిఁ దెలియుఃట్లాలోచన మొనరించుటయు, జనులయప్రీతిని దెలిసికొనియు వారితోఁ గూడి ప్రవర్తించుటయు, విశ్వసనీయులను వేఱుపఱ

చుటయు, మోమోటమిచే నాలోచించుస్థలమునందు నాలోచనకు దగనవారి నుంచుకొనుటయు, నాలోచనమును వెల్లడించినవానిని శిక్షింపకే యుండుటయు, వింత జనించినప్పు డదియేమి యని కనుకల్గి విచారింపకుంటయు, పూజ్యులైనవారియెడ నేకరీతి పూజ యొనర్పకుంటయు, హీనులతోఁ జెల్మి చేయుటయు, వ్యసన (సప్తవ్యసనములు) పరుఁడై యుండుటయు, చలము కలిగియుండుటయు, జేనికిఁ గూడదు.

దివ్యభూమ్యాకాశములనియెడు త్రివిధోత్పాతములు జనించినయెడ నవనివిభుఁడు విశేషద్రవ్యమును వెచ్చించి బ్రాహ్మణులను, దేవతలను, అగ్నిని, భక్తిబలిహోమాదుల విడిచి శాంతి యొనర్చునది.

నృపుఁడు నుద్యోగులకు యోధుల కన్యోన్యవైరము వృద్ధియగునట్లు చేయఁదగును. అందువలన నొండొరులమంచిచెడ్డలు దాఁగకపోవుటయే కాక, వారియందు మిత్రత్వమువలన నభివృద్ధిఁ జెందుధూర్తతాదులవలనఁ గలుగుచెడుచింతలైన లేక యుందురు.

ధరణీపుఁ డెచ్చటికేని తాను స్వయముగఁ జనఁ దగదు. తనకు సహాయముగా నుండుట కొకని దొరఁజేసి పంపనగు. అరి దుర్బలుచేఁ గీడ్పడఁడు కావున జేఁడంపుదొర యర్థభూతురగర్ధి లేక కొఱగాఁ డటుకావున నల్కకుచితవృత్తి గలుగు నాప్తుఁడైన ద్విజాన్యునకు రాజు వస్తుసాధనసమృద్ధ మగుదుర్గభూ

మూల నావారకిచ్చి సుఖింపనగు.

తనరాజ్యముల కెల్లెలయందు వనముల నృపుఁడు దట్టముగాఁ బెంచి, స్వరాష్ట్రమున నున్న యరణ్యంబులనడుమఁ బాళ్ళుపాళ్ళుగ నరికించి దస్యులచే బాధనొందకుండ సుఖించునది.

మట్టిగోడను నీటఁ గడిగి మృత్తికాశూన్య మొనరింపఁ దలంచుటంబోలె కొలఁదిమన్నికకై యాటవికజనుల మొదలంట నశింపఁజేయఁదలంచుట దుస్సాధ్యము. కావున సత్యవాక్యముచేతను, వాహనాదిదానముల నిచ్చియు, నయ్యాటవికుల నృపుఁడు వశవర్తులగునట్లొనర్చుకొనినచో శత్రువులపై దండెత్తుటకును, గడిదేశములఁ గొల్లకొట్టుటకును, వారు పనికివచ్చెదరు. పృథ్వీపాలన మొనరించువానికిఁ బలువురు చేయునపరాధమును శిక్షించుటకాని, యనేకులశిక్షించుటకాని, తలంచుట యయుక్తమగు.

ఏనుఁగులను, మంచియశ్వములను, మున్నగువానిని దెచ్చుదూరమునందలి ద్వీపాంతరవర్తకులకు నివసింప సదుపాయములగు గ్రామములను, సద్గృహములనుండునట్లు ప్రోత్సహించి, వర్తకులకు బహుమానముల నిచ్చియు, మంచిపొల లిచ్చియు, నాయశ్వాదులు రాజుతనశత్రువు నొందకయుండునట్లు చేసికొనుచు, వర్తకులఁ స్వవశముచేసికొన సుఖించును. తనపొరుగు రాజుల రాయబారులతో సమ్మైత్రిగ కొలువున సరససల్లాపము లొనరించునది. కార్యఖడ్గవాదములను చరులకుఁ దెలియనీ

ట్లు పలుకునని నావిషయములనే మైత్రి నెఱపునట్లుఁ జేలఁ బల్కులు నిత్రి.

ఱేఁడు తాను స్వతంత్రముగ సుద్యోగమునిచ్చినవానిని వేగ మంత్రమునకు లోఁజేయరాదు. వాఁడు స్వాతిసగౌరవమున కుబ్బి వానిమిత్రులకెల్లఁ బల్కు నాకార్యము చెడు. వాఁడడఁగు. కావున మంత్రాలోచనమునకుఁ బార్థివుండు భద్రముగ నుండునది. హితమును, విశేషశాస్త్రపరిచితియు, ధర్మాసక్తియు, తనవంశక్రమానుగత్వము చేతఁ గలిగిన శూరత్వమును, గలిగి మనుద్విజులను, దుర్గాధికారములందు నిలిపి, పులిజున్న మున్నగు నపూర్వపదార్థచయమును, నూఱుసంవత్సరములవఱకు సుఖముగ నాదుర్గమునందు నివసించుట కనువగుసాధనములఁ గూర్చి, సామంతకోటికి నియమానుసారము సీమంతభూమియైనఁ దగ్గకుండ భూమి లొసంగి, న్యాయముకంటె నాయ మధికముగునటులఁ జూచుకొనుచు, ప్రజాపీడాకరము గాకుండునట్లు భాండార మభివృద్ధి చేసికొనుచు, శత్రుదేశమును వేగులవలనఁ బరిశీలించి స్థితిగతుల నెఱిఁగి, (నీటికడ మత్స్యభక్షణార్థము కదలక యోగివలె నుండి చేఁపలఁ జెంతఁ జేరఁగనే మ్రింగుచుండు బకమువలె సమయము చిక్కినతరుణమున) హఠాత్తుగఁ బరరాష్ట్రము నాక్రమించి, తనవారను బ్రజలకు నలజడి లేకుండ నుపాయమునఁ బగఱ నలయించు నృపతి యొకప్పైఁ జేతులు వైచుకొని నిద్రింపఁగలఁడు.

గజాశ్వక్రియమునకును, వానిని మేపుటకును, మంచిభటులవేతనమునకును, బ్రాహ్మణ, సురపూజార్థమును, తనభోగాధిక్యతకును, వెచ్చపడుధనము వ్యయము కానేరదు. (అనగా నట్టివ్యయము రాజవశ్యము చేయవలెను. అది యనవసరము కాని, దుర్వ్యయము కాని కానేరదు.)

మనుజేశునకు శత్రునెడఁ బ్రతిజ్ఞాదులు కూడవు. యుద్ధయాత్రకుఁ బోయియు నేఁ డొకప్పుడు కార్యసాఫల్య మొందును. ఒకప్పు డాలస్య మగును. ఒకప్పుడు కష్టసాధ్య మగును. ఱేఁడు కార్యవాదియు సమరశీలుఁడు నగుటఁ బ్రతిజ్ఞాదికములవసరము కావు.

పోరానిపట్టుల యుద్ధమునకు దిగినయెడల శత్రుబల మెదిరించినయెడ వారు తెగించి పోరుదురు. కాబట్టి వారి కొకప్పుడు జయము కాని స్వర్గఫలము కాని చేకూరును. (కావున దారిలేనిశత్రువును గవియఁ దగదు.) నానాయంత్రసహిత మగుప్రాకారాదులఁ గూల్పఁ బ్రజ లనె కవియించుటఁ బొసఁగు!

ఎవ్వఁడైన నృపతులమనంబుల కొకటి రెండు మారులు సరిపడునాలోచనములం జెప్పినయెడల రాజు లాతని పిలువనారంభింతురు. అట్టిపిలుపు చనువునకే వాఁడు ధనాదికముల స్వీకరించి, మదించి, యసంగతకార్యములఁ జేయఁ జెప్ప సాహసించును. కావున నేఁ డట్టియాలోచనములఁ జెప్పువాని వేఱె నడవడిని వేగువానిచేఁ బరిశీలింపఁ జేయఁజను.

పొరుగురాజు బలహీనుఁడైన నెత్తిపోయి జయింపవలయు. కానియెడల మైత్రియే పాటింపఁదగు. దూరమునఁ గల యెల్లలయందుండురాజు తన క్షేమప్రయోజనమున కుపయోగపడును? (పడఁడు.) అట్టిదూరపువానితోఁ దనపొరుగురాజు శత్రుత్వము నొందియుండినఁ దనకే మేలు. తనయెల్లలఁగూడ నాతఁడు రక్షించుచుండును కదా!

శత్రురాష్ట్ర దుర్గాదుల హరింప, పగఱవనితలు చేఁజిక్కినయెడ వారికిఁ బుట్టినింటఁ గల్గుగౌరవము నిచ్చి యాదరించి భుజప్రవర్తనమున మెలఁగు టుచితంబు. ఒకప్పుడు సంధి యగుంగావున నాశత్రువులరాయబారులకడఁ గఠినవాక్యము లాడక యుండునది.

హింసాకర్మము లొనరించునట్టియు, నిబిడవిషజలపరిపూరితమును, సతతవ్యాధిపీడితమును, తరుశైలనిబిడమై దుర్గమమగునట్టియు, ధూర్తమ్లేచ్ఛదేశంబులకు మేరుతుల్యధనము కల్గినను ఱేఁడు పోక సైన్యము నంపి పోరుసలుపుట మేలు!

సంతసమున నున్నతరి నృపునకు మంచిమాటలఁ జెప్పి, స్వకార్యముల ముగించుకొనఁ గొలిచి, తాఁజెడినప్పుడు కపటి తొలఁగి పోవును. అట్టివారిని తెలిసికొనుటయందు నృపుఁడు నాణె మెఱుఁగుటయందు బచ్చు ప్రవర్తించునటులఁ జరించునది. అభిజ్ఞులైనవారిని గలయఁ జేసి సువర్ణాదిధాతువుల నెఱింగి, సువర్ణాదుల గ్రహించి ప్రజల కనుగుణముగ మితద్రవ్యాప

హారియై ప్రబలశత్రువుల యౌద్ధత్యమును దండించి వీటఁ బుచ్చి, ప్రేమగలహృదయంబున సమస్తమైనవారిని బోషింపవలయు. వర్ణభేదములయందలి తప్పనడవడుల నుడిపి యెల్లప్పుడును ద్విజులఁ గాపాడుచు, దుర్గములఁ బెంచి, మధ్యదేశగతారణ్యములఁ బలుచఁ జేసి, ప్రతాపాభివృద్ధిగా నగరపరిశోధన మేమఱక రాజు (సాంగ) సప్తాంగరాజ్యమును, *వైద్యులను బిలిచి సప్తధాతువులఁ (నాడుల) తెలిసికొని, సువర్ణాదుల సేవించి, శరీరప్రకృతి కనుగుణమగు నల్పాన్నోదకములఁ దృప్తుఁడై, శరీరమునందు బలోద్రేకంబు కలుగకుండ మర్దనచే నడఁపి, శరీరమునఁ దైలములఁ బూసికొని, శరీరమంతయుఁ బోషించి, శిరోజములవర్ణములయందలి దోషము లుడిపి, దంతముల యభివృద్ధి చూచుకొని, హస్తముష్ట్యాదుల బలియించి, యువరాదులక్రొవ్వణగించి పలుచఁ జేసి, శరీరపరిశోధనము మఱువక తేజమునఁ గ్రాలుచు స్వాంగ (స్వశరీర) రాజ్యమును, సమముగ నృపతి యాయుష్కాముఁ డగుట నభివృద్ధి చేసికొనునది.

ప్రభాతసమయమున సుఖశయనమునడుగువారితోడను, వైద్యజ్యోతిష్కులైనద్విజులతోడను, జాముప్రొద్దెక్కిన వెనుక మంత్రి సామంతాదులతోడను, ద్రవ్యార్జనాధికారనియుక్తలగుకాయస్థ (శిష్టికరణము లనఁబడువారు పూర్వము కరిణీకవృత్తియందుండువారు.) గోష్ఠియందును. మధ్యాహ్నసమయమునం దంగమర్దనాదులు (ఒడలు నలుపుట) చేయుమల్లురతోడను, వంటల

వారు, పప్పుకూరలు వండువారు, మాంసములఁ దెచ్చువేఁట కాండ్రు మున్నగువారిగోష్ఠియందును, పగటితృతీయభాగము నందు దేవతార్చన మొదలగునాత్యధర్మాచరు లగుయతీశ్వరుల గోష్ఠియందును, భుజించినపిమ్మట వేడుకచెలికాండ్రు (విదూషకాదులు) పౌరాణికులు, కవీశ్వరులు, మొదలగువారిగోష్ఠియందును, సాయంకాలమునందుఁ వేగులు, గాయకులుమున్నగువారితోడను, రాత్రియందు నిద్ర మున్నగుకార్యములకుఁ బూర్వము భార్యతోడను గోష్ఠి గలిగి మహీంధవుండు మెలంగునది.

రాజునకు హితులు, హితాహితులు, సదాహితులు సని ముత్త్రెఁవములననుచరు లుందురు. వా రెవ్వరన:— వైద్యులు, జ్యోతిషుకులు, విద్వజ్జనులు (పండితులు) కవీంద్రులు, పురోహితులు నగువీరు హితులు; ధనార్జనకృత్యముల నియోగింపఁబడినవారు హితాహితులు (హితాహితములఁ గలిగియుందురు.) కోలుపడిన రాజ్యమును తనవద్దనుండి సమయమువెంటఁ దిరుగఁ బొందవేచియుండువారు కేవల మహితులు; కావునఁ జతురవృత్తిని వారివారిపట్ల నట్లఁ జరించుట నృపునకు నీతియుక్తం బగు.

పాత్రుఁడైనవాని బాగుగఁ బరికించి, (ఋతుకాలమునందు) పనసపండ్లొక్కసారి దిగుమాఱ్చక, యాతఁ డడుగక యుఁ బరు లాతని కిమ్మని చెప్పకయు మునుప నాతఁడు స్వప్నమునొంది విభ్రాంతినొందునటుల నాతని కిచ్చి (ధనాదికముల) యాతని నాశ్చర్యమగ్నునిఁగ జేఁ యొనర్చుట యుచితంబు.

పితృదేవతాక్రియలయందుఁ బితృకర్మలె ధర్మసూక్ష్మములగుటచేఁ బితృభక్తి కలవాఁడై వేదశాస్త్రజ్ఞులై, ఋజుప్రవర్తనముచే వృద్ధులై శాంతులైనయచ్యుతభక్తుల నభీష్టవస్తువులఁ దనిపి పితృదేవత లూర్ధ్వలోకగతిని బొందునట్లొనర్చుట సముచితంబు.

బ్రాహ్మణసంరక్షణముకొఱకు దానమును, స్వరక్షణమునకై జ్ఞానమును (ననితెలిసికొని) యెల్లప్పుడును శ్రీమన్నారాయణునకు శరణు జొచ్చి "రాజ్యాంతే నరకమ్ ధృవమ్" నులోక్తివలనిభయమును వీడఁదలంచుట కంటె వేనికొండుమార్గము మృగ్యము.

భార్యకుఁ బతిభక్తియు, స్త్రీపురుషులకు వావివరుసలును, యతికింద్రియనిగ్రహత్వమును, కొలఁదిజాతికి ద్విజానుసరణమును, వేనికి మంచివాఁడై భృత్యుఁ డౌదవుటయు, రాజదండనభయముననే సుమా!

చంపియు ధార్మికుండు, సతిఁ బొందియు బ్రహ్మచారి బొంకియు సత్యశాలి, ఆరగించియు నదుపవాసి, కేడించియు శూరుఁడుఁ జెందియు ధనియగుట నెఱిఁగి నృపుఁడు మనఁదగు *

(దుష్టులను జంపినను ధర్మము పోవదు; ఋతుకాలమున ధర్మచారిణిఁ బొందినను బ్రహ్మచర్యంబు చెడదు; పరులకు మే

*(శాంతిపర్వము చతుర్థాశ్వాసము ఇంద్రప్రహ్లాదసంవాదప్రకారము నకుఁ వైపద్యము 363 ని జూచునది.)

లొనరింపఁ బొంకినను సత్యవిరుద్ధము కాదు; దినమున కిరుమారులఁ గుడిచియు సదోపవాసియగు;గురుజనాదులతో వారియనుమతిని సంప్రాప్తమైనయుద్ధము మానియు శూరత్వమున డిందుపడఁడు; సద్వ్యయ మొసరించి ధనహీనుఁ డయ్యు ధనియే !; కావున నిట్టిధర్మసూక్ష్మముల జేఁ దెలియుంగునది.)

తేనిపట్టణమునందుఁ గాపుర ముండువాఁడును, నానాభాషల నెఱిఁగినవాఁడును, దేశాంతరవేగులఁ దెలిసినవాఁడును, చిహ్నలేశుఁడును, కోరినదానికంటె నధికధనము నొందనివాఁడు నగువాఁడు వేఁగులవానివృత్తికిఁ బ్రవేశింపఁడు.

ఉపవాసాదికముల శరీరము కృశింపఁజేయుటవలనఁ గలుగుఫలములఁ బార్థివుండు ధనమిచ్చి సంపాదింప నగును; ఏమనఁగా నాయాఋతువుల కనువగుమర్దన, స్నాన, భోజన, లేపన, వస్త్రధారణ, పుష్పధారణాపరత నుండుపతి కుపవాసాదికము లొనరింప వీలుండదు కదా !

అనేకరుచులఁ గూడియుండునృపభోజన మపరాహ్ణమునం గాని, లోఁగడుపు శుద్ధిమైయుండునపుడు గాని, చేయఁదగు. తమి భుజించినచోఁ నెపుడు పథ్యమై యుండును?

ధర్మార్థకామములనుత్రివర్గసంపాదనమున నృపుఁడు సమదృష్టి నుండినను, ధర్మ మధిక మగునెడ నితరచేలకుఁ బెట్టిననీరుకూడఁ గట్టతెగి వరి (ఊడ్పు=దంప=మాగాణి) చేనునకుఁ బాయినప్పటివలె నృపుఁడు ముదమందఁ దగు.

భూపతి యెల్లప్పుడుఁ బ్రకాశార్ఘ్య మొకమంచిరత్నమును ధరించును, వేషదర్పమునకుఁ బ్రతివారమును గనువగురత్నభూషణముల ధరించుచుండవలయును.

రాజు రాజ్యము చేయుచుంటిని పాపమునుండి విముక్తుఁడ నగుట యెట్లని విచారింపఁ దగదు; వేదము లైనశక్తికి సాధ్యం బగుకార్యంబులనే చేయుట శాసించును; కాని యశక్యముల నాజ్ఞింపఁ జెప్పుట లేదు.

మనువు యమధర్మరాజాదులు చాలవఱకు దోషముల నఱిఁగి, దండించిరి, ధర్మపరుల నఁబజగిరి. ప్రజానాథుండు (బ్రహ్మ) ప్రజాపరిపాలనంబు పనిగా ననేకదేవతలయంశంబునఁ దన్ను బుట్టింప నృపుఁడు పుట్టెను. కావున వేదములు పాకుృచ్ఛ విరాట్టు, సమ్రాట్టు, మున్నగు నామంబులఁ బఱగు సురతుల్యుం డైనమూర్ధాభిషిక్తుండు, కష్టముల సహించి లోకముల కగునలజడి తీర్చినంగాక జన్మంబు సఫలంబు కానేరదు; (సార్థకాభిధానుం డెట్లగు?)

„కేవల కర్మేంద్రియతృప్తికొఱకుఁ బౌంథభార్యాసమూహముల బందీకృతులఁ గావించి, కొట్టి, యపహరించుటవలన సంపాదించినధనము గలదొంగలరాజులకుమాత్రముకాలముగడువదా! ఇంతలంపటత్వ మేల" యని యవనిని రక్షించుటయందు విముఖత కూడదు. ఏమనిన పూర్వము కృతయుగంబునఁ గృతవీర్యసం

దనుం డగుసహస్రబాహుఁడు తనభుజస్తంభములచేత భరింపఁబడు నీపృథ్వియం దెల్లయెడల శస్త్రధారియై తోఁచి యెల్లర కెల్లకాలములయందునాజ్ఞయిడి భరించె. అట్టియంతియుయుగంబునయాగానుసారంబుగ వితతసారం బగు రాజలోకంబునకు శక్యంబు కాదు కదా! ఒక్కరాజలోకంబున కన నేల? ఇక్కాలంబునందలి భూసురులకు నక్కాలంబునందలి భూమిదివిజులకుఁ గలశక్తి యున్నదే? ఒక్కబాడబుండు (బ్రాహ్మణుఁడు=అగస్త్యుఁడు) కడలినీరుం గుక్కిం గొనడె! ఒక్కవిప్రుండు (విశ్వామిత్రుఁడు) స్రష్టసృష్టికిఁ బ్రతిస్రష్ట యయ్యె! ఒకబ్రాహ్మణుఁడు (వసిష్ఠుఁ డను నొకమునివర్యుండు) బ్రహ్మదండముచేత బ్రహ్మాస్త్రమును వారించె! అట్టి యనుష్ఠానంబు మాకులే దేమిప్రయోజనంబని శక్త్యనుష్ఠానంబు వీరికి విడువవచ్చునే! వీరితరుల కుపాసనీయులు కాకపోయిరే! కావున సావధానుండవై శక్తి కొలఁది కన్నది విన్నదియు నుపేక్షింపక రక్షణశిక్షణంబు లాచరించుచు, సశక్యంబున కార్తశరణాగతరక్షకుఁడ వగుచుండ రీకాత్ముమీఁద భారంబిడి, యహంకృతిలేక, ప్రవర్తిల్ల, నెల్లసంసిద్ధులు సులభలభ్యంబు లగు! అది యట్లుండె. అట్లయిన పట్టభద్రుం డగురాజు ధర్మంబునందె దృష్టియిడి నడువవలయు. దిక్పాలాది జన్మంబులు బహుజన్మసుకృతఫలంబులె! త్రిలోకంబులును ధర్మప్రతిష్ఠితంబులు. కావునఁ దదాచరణచణుండవై

ఋషి, దేవ, పితృఋణములఁ దీర్చుచు సత్కార్యములఁ జేయుచుఁ దనసహాయులయం దుత్తమకీర్తి నందినవాఁడై రాజ్యపరిపాలనంబు సేయుట రేనికిఁ బరమధర్మంబు.

గద్య: ఇది శ్రీకృష్ణదేవ మహారాయకృతాము
క్తమాల్యదాంతర్గతయామునాచార్య
నీతిప్రకారంబునకు, శ్రీభారద్వా
జసగోత్రపవిత్రనరసింహామాత్య
ముత్యమాంబాకనిష్ఠపుత్ర
వంగూరిసుబ్బారాయ
పరివర్తిత గ
ద్యము.



